శ్రీ హనుమతే నమః

# శ్రీ హనుమచ్ఛతకము

ఇత్యాది

గుంటూరు తాలూకా తుళ్లూరు గ్రామ...



★ ★

19 24

శ్రీమాన్ దిట్టకవి వేంకటనరసింహాచార్య

ప్రణీతంబై.

మ. రా. శ్రీ మాదిరాజు రఘునాధరావు గారిచే

ప్రకటింపబడెను.

శ్రీ హనుమతేనమః

# శ్రీ హనుమచ్ఛతకము

ఇత్యాది

గుంటూరు తాలూకా తుళ్లూరు గ్రామ...



19 ★ ★ 24

శ్రీమాన్ దిట్టకవి వేంకటనరసింహాచార్య

ప్రణీతంబై.

మ. రా. శ్రీ మాదిరాజు రఘునాధరావు గారిచే

ప్రకటింపఁబడినది.

శ్రీ హనుమతేనమః

# విజ్ఞప్తి.

శ్రీ హనుమచ్ఛతక ప్రకటితుఁడును నామిత్రుఁడునునగు మ. రా. గా. శ్రీ మాదిరాజు రఘునాథరావు పంతులుగారియెడల నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈ హనుమచ్ఛతకంబున హనుమజ్జననంబును బాల్యక్రీడయును విద్యాభ్యాసమును సుగ్రీవునిసేవకత్వమును శ్రీరామలక్ష్మణ సమాగమనంబును శ్రీరాములక్ష్మణుల జనన వృత్తాంత శ్రవణంబాదిగాగల చారిత్రాత్మక ప్రార్థనములతోడను, నధ్యాత్మికాభీష్ట సానుభూతికాది ప్రార్థనములతోడను వ్రాయంబడెను. కాన గుణగ్రహణ పారీణులగు మహాశయులెల్లరుఁ దప్పులఁ ద్రోసి యొప్పులఁగ్రహించియుఁ దప్పుల నొప్పులుగా సవరించియుఁ గృతార్థునిఁ జేయ ప్రార్థించుచున్నాఁడ.

గుంటూరు,
1-12-1924.

ఇట్లు,
దిట్టకవి వేంకటనరసింహాచార్యులు.

శ్రీ హనుమత్స్వామినే నమః



రమణీరమణుఁడు కృ
పారసదృక్కంజవిమలపర్వము లొలయన్
ధీరుని జేయుత వివిధా
చారుని రఘునాథరాయ సచివాగ్రణినిన్.

సీ. దేవాలయాది ప్రతిష్ఠ సంతాన వి
రాజమానులు మాదిరాజువారు
సకలసదైశ్వర్య చటులవిభ్రాజ బి
డౌజులీధర మాదిరాజువారు
వివిధకళాశాస్త్ర విద్వాంసనన్మణి
భోజులీధర మాదిరాజువారు
దానధర్మాది సంస్థాన యశోజిత
రాజులీధర మాదిరాజువార
లట్టిశుభాన్వయంబునఁబుట్టి సప్త
సంతతుల నిల్పఁగాఁబూని చాలబట్టి
నట్టి మిముఁబ్రోచుగాత శ్రీహరియునెపుడు
శ్రీధరాధ్యేయ శ్రీరఘునాథరాయ.

ఉ. శ్రీవనితా మనోహరుడు శేషశయానుఁడు భూరిభోగ్యస
త్పావన లీలలన్మెలగు వారిజనేత్రుఁడు ధర్మసత్యసం
భావుని మాదిరాజ కులవార్నిధిసోముని లోకవశ్యునిన్
బ్రోవుత ధీమణిన్ సుకవిపోషణునిన్ రఘునాథరాయునిన్

క. శ్రీమాదిరాజవంశ ల
లాముని రఘునాథరాయ లాలితయశునిన్
ప్రేమంబునఁ బ్రోచుచు నాగి
శ్రీమంతునిఁ జేయుమయ్య శ్రీహనుమంతా.

క. ధీమంతుని సద్భక్తుని
సామీరీ? యబ్బరాజు జగ్గాంబలకున్
ప్రేముడి కొమరుని సతతము
నోముము రఘునాథరాయు నుద్యద్యశునిన్



శ్రీ హనుమతే నమః

# హనుమచ్ఛతకము.

క. శ్రీరఘురామప్రభు పద
నీరేజ మరందపాన నిరుపమహృదయా!
శారీరకళాజిత బా
లారుణ? తుభ్యారు వీరహనుమత్స్వామీ. 1

క. సంగీతవేదవర వే
దాంగాభ్యాసాంతరంగ? హరిముఖసేవా
సంగ? జగత్రయజనపూ
జ్యాంగా? తుభ్యారు వీరహనుమత్స్వామీ. 2

క. వానర యూథాగ్రేసర?
దానవ కాననవితాన దావానలసం

ధానవిధాయక? శ్రీహం
చానన? తుభ్యారు వీరహనుమత్స్వామీ. 3

క. ప్రాయంగడఁగితి శతకము
నీయందలి భక్తిచేత నెరసులనెల్లన్
బాయఁగఁ జేయుట జుమ్మీ
న్యాయము తుభ్యాగు వీరహనుత్స్వామీ. 4

క. మహనీయులఁ గొలుతుఁ బితా
మహీపితామహులను బరమయశోనిధులన్
మహి "లక్ష్మను కృష్ణుల" న
న్వహమును దుభ్యారు వీరహనుమత్స్వామీ. 5

క. "ధనకుధరా"న్వయునకును జ
ననీ జనకునకును జేతునరసింహో చా
ర్యునకును దాసోహంబుల
ననయముఁ దుభ్యాగు వీరహనుత్స్వామీ. 6

క. వాచకవిదు "వేంకటరం
గాచా"ర్యునిఁ గొలుతు "వేంకటాచార్య"నిని
త్యాచారుని నిరతముద్ధై
ర్యాచల తుళ్లూరు వీరహనుమత్స్వామీ. ౭

క. నియతిన్ "గోడవటి కం"ట్య
న్వయ జలనిధిచంద్రుఁ గొల్తు శ్వశురుని నెపుడున్
నయుని "నృసింహాచార్య"సి
వ్యయహార తుళ్లూరు వీరహనుమత్స్వామి. ౮

క. పాయక కొలిచెద సజ్జన
గేయుని శ్రీ "తుర్లపాటి కృష్ణయ" గురునిన్
శ్రేయస్కరు సద్యశుని
ద్యాయుతుఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ. ౯

క. తిక్కన నెఱ్ఱన నన్నయఁ
జక్కఁగ శతకంబు ముగియఁజాలఁగఁ గొలుతున్

గ్రక్కున జననీజనకుః
నక్కఁడఁ దుర్భ్యాగు వీరహనుమత్స్వామీ. 10

క. చదివిన కావ్యంబొకటియుఁ
బదపడి లేదాయె నుభయభాషలయందున్
మొదలెఱుఁగను లక్షణముల
నదనునఁ దుర్భ్యాగు వీరహనుమత్స్వామీ. 11

క. వ్రాసెద నురుతరముగ నీ
శాసనమునఁ గందపద్య శతకంబొకటిన్
వాసిగఁ గైకొనుమీ వి
న్యాసముఁ దుర్భ్యాగు వీరహనుమత్స్వామి . 12

క. పెన్నిధిఁ జూచిన కైవడిఁ
బన్నుగ సాటింతు భక్తిఁ బద్యంబులచే
నెన్నెద నీనామాంకిత
మన్నింటఁ దుర్భ్యారు వీరహనుమత్స్వామీ. 13

క. జనియించితి వలదశిమీ
శనివారమునాఁడు గురుదశాకాలవిశా
ఖను వైశాఖాంతంబున
ననువుగఁ దుఃఖ్యాగు వీరహనుమత్స్వామీ. 14

క. పట్టిబియంజనకు మగు
ద్భట్టారకునకుఁ బ్లవంగ వర్గంబునకుఁ
జెట్టివి, దిట్టవ్రజగముల
కట్టిటుఁ దుఃఖ్యాగు వీరహనుమత్స్వామీ. 15

క. పసితనమున భాస్కరుఁ గని
మిసమిసలాడెను ఫలముగ మింటివిహారియునా
కసమునఁ గబళింపవె దు
ర్వ్యసనతఁ దుఃఖ్యాగు వీరహనుమత్స్వామీ. 16

క. అరవి వేడిమినోర్చియ
నూరునితోఁ బ్రాగపరశిలోచ్చయముల నా

ధారముతోఁ జదువవె చదు
వారిఁటఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 17

క. శ్రీరామ లక్ష్మణా కృతు
లారసి బెగడొందు కపికులాగ్రణికిని నా
ధాయుఁడవై వృత్తాంత వి
హారివి తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 18

క. దాశరథుల జన్మంబును
గౌశిక యజ్ఞావనంబుఁ గళ్యాణ మహా
ల్యాశాప ము వినినావుమ
హాశయ తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 19

క. పట్టాభిషేక విఘ్నముఁ
బట్టణ విరహార్తియు మఱి పదునాల్గేండ్లున్
నట్టడవియునికి వింటివి
యట్టెడఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 2

క. మారీచుని వృత్తాంతము
శ్రీరాముని నడవడియును సీతాహరణం
బా రావణు కథవింటివి
గారా? తుల్లూరు వీరహనుమత్స్వామీ. 21

క. దశరథతనయుని కథవిని
కుశలుఁడు సుగ్రీవుఁడు నిరుగురికిని నొక టే
దశతగునంటివి సఖ్యము
కుశమునఁ దుల్లూరు వీరహనుమత్స్వామీ. 22

క. వాలినిఁ గూల్చియు రాజ్యము
నాలిని సుగ్రీవుఁ జేర్ప నయ్యెడఁ బైకా
ర్యాలాపముఁ దెలుపవె సుగు
ణాలయ తుల్లూరు వీరహనుమత్స్వామీ. 23

క. ముద్రికఁ గైకొనియామ్య స
ముద్రముఁ జేరియుఁ బయినముముడివడఁగ మహేం

ద్రాద్రికిఁ బోయితివఁట కన
కాద్రిభ తుళ్లాయ వీరహనుమత్స్వామీ. 24

క. రామునిఁ దలచుచు నెగసిఁయు
హేమవతుంగనఁ గొసిసురసానన బిలమున్
క్షేమంబున వెడలితివి, ని
రామయ తుళ్లాగు వీరహనుమత్స్వామీ. 25

క. బాఱిన సింహికనోటను
దూఱియుఁ గడుపుంబగిల్చి దొరతోరఁ బోవన్
దాఱిన లంకను బెట్టితి
వారాశిఁ దాళ్లాయ వీరహనుమత్స్వామీ. 26

క. లంకాపురిఁ జొచ్చియుని
శ్శంకనుగాంచితివి రేయిజానికిఁ జూడన్
లంకానాధుని గృహాప
ర్యంకముఁ దాళ్లారు వీరహనుమత్స్వామీ. 27

క. సీతఁ గనుంగొనఁ జాలక
బ్రాతరలాడుచు నశోకవన వాటికకుఁ
గాతరమతివై బోయితి
వాతజుఁ దుల్లూరు వీరహనుమత్స్వామీ. 28

క. శింశుపయను తరువున సూ
త్స్మాంశాంగముతోడనుండి యాదానవవా
ద్భ్రంశము వింటివి దుర్వా
వాంశముఁ దుల్లూరు వీరహనుమత్స్వామీ. 29

క. కొంకక వృక్షంబును దిగి
పంకేజ దళాక్షి వదనవైఖరిఁ గనియుఁ
బొంకకఁ జూపితివటు ము
ద్రాంకముఁ దుల్లూరు వీరహనుమత్స్వామీ. 30

క. కాకాసుర వృత్తాంతముఁ
గాకయు చూడామణిఁగొని గగ్గోలువడఁ

వీకం ద్రుంచితివా నన
మాకడఁ దుళ్లావు వీరహనుమత్స్వామీ. 31

క. రాక్షసభటులను గూల్చియు
నక్షకుమారుని నడఁచగనల బ్రహ్మాస్త్రం
బాక్షణమునఁ బట్టదె ని
న్నాక్షితిఁ దుళ్లావు వీరహనుమత్స్వామీ. 32

క. దూతను జంపగ రాదని
నీతోఁకనఁ జిచ్చుఁబెట్ట నిల్కడతో వి
ఖ్యాతిగ లంకను గాల్చితి
వాతజఁ దుళ్లారు వీరహనుమత్స్వామీ. 33

క. రామునికిని భూజాతా
క్షేమముఁ దెల్పంగఁ గోరి సింధుప్రలీలన్
సీమంబున దాటవె నూ
ఱామడఁ దుళ్లావు వీరహనుమత్స్వామీ. 34

క. మధువనపాలుండగు యా
దధిముఖునాజ్ఞఁ గడచియుఁ దార్కొని కపులన్
మధువుం గ్రోలఁ జేసి
ర్వ్యథతను దఃల్లారు వీరహనుమత్స్వామీ. 35

క. చూడామణిఁ జేఁబట్టియు
జాడం బడితిని జనకజఁ జూడంబడె నీ
ప్రోడయునన రాముఁడుగొని
యూడకె దుల్లారు వీరహనుమత్స్వామీ. 36

క. సీతాసందేశంబును
బ్రాంతిగ శ్రీరామునితోడఁ బలికియునాపైఁ
గోఁతులమూఁకకుఁ జెప్పవె
ఖ్యాతిగఁ దుఖ్ఖాగు వీరహనుత్స్వామీ. 37

క. సీతాదేవికి రాముని
సేఁతలుఁ జెప్పియుఁబలికియు శ్రీరామునితో

సీతాగతిఁ బ్రోతువు బో
యాతఁడెఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 38

క. హనుమంతుఁడె ప్రియభృత్యుం
డనఁదగునని రాముచేత నయ్యెడ సుగ్రీ
వునికిని జెప్పఁబడవే?
యనఘా? తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 39

క. నన్నును నాతమ్మునినిఁ
బన్నుగ జీవింపఁజేయఁ బైదలి బ్రతుకున్.
గన్నావనెఁ గదరాముం
డన్నా? తుళ్లూరు వీరహనుమత్స్వామీ. 40

క. విక్రమమున రావణునిం
జక్రంబునఁ దునిమి వైచి జానకిఁజూడన్
సక్రమమునుంటివి ధృతశౌ
ర్యక్రమ తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 41

క. వెడలితి వాతజిమార్గము
నలినలిఁ జేయంగ సైన్యనాయకుతోడన్
దలఁకక రాముఁడు మూఁపున
నలరఁగఁ దుళ్యారు వీరహనుమత్స్వామీ. 42

క. శత్రువిభీషణు కార్యముఁ
జాత్రా పాత్రతనుడిపియుఁ బ్రభుసఖ్యునిన్
గోత్రాధిపుఁ జేయవె యా
యాత్రను దుళ్యారు వీరహనుమత్స్వామీ. 43

క. జలధికి సేతువుఁ గట్టఁడె
బలఁగము దినపంచకంబు పర్వత చయమున్
దలనిడి జేర్పఁగనళుఁడును
నలయకఁ దళ్లారు వీరహనుమత్స్వామీ. 44

క. లంకాపురపర ద్వా
రాంకమునంబగతుసిఁ దెగడార్పవె ధూమ్రా

తౌంకితుఁ గపటునిఁ ధృత సూ
ర్యాంకా? తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 45

క. పన్నగ రాముని లక్ష్మణుఁ
బన్నగపాశంబునుండి బాయఁగఁ జేయన్
గన్నావుగ నాగ్గోషధు
లన్నిఁటఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 46

క. అంతకుఁ జేర్చెనుగద దే
వాంతకునింబగతుని రణమందందే నీ
ఘుంతియముష్టి ప్రహారమ
నంతా? దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 47

క సమరమున నింద్రజిత్తుఁడు
గమకించియుఁ బైకిఁ మోఁకఁగడువడి నీపై
హమతను నడ్డఁడె లక్ష్మణుఁ
డమరగఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 48

క. బ్రతికించితి సౌమిత్రిని
మృతసంజీవినిఁ గయికొని మిత్రోదయ మం
దతిరయమునఁ దెచ్చియుఁ బ్రా
యతముగఁ దుఖ్యాగు వీరహనుమత్స్వామీ. 49

క. మానుగ శ్రీరాముఁడు స
స్వానిశ్వరదివ్య బాణమహిమాస్పదుఁడై
దీనునిఁ గూల్పఁ దెగ్రుమటిస్ని ద
శాననుఁ దాఖ్యాళు వీరహనుమత్స్వామీ. 50

క. రావణవధ శ్రీరాముని
జీవితదిగ్విజయ వార్త సీతకుఁ జెప్పన్
వేవేగను బోయితివా
ర్యావన తుఖ్యాగు వీరహనుమత్స్వామీ. 51

క. లోకాప వాదమునకుం
బ్రాకటముగ సీతనగ్నిఁబడఁ బ్రోయుఁగ సీ

తా కాంతునిఁ జేర్పఁ జావే
ల్వాకడఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 52

క. శ్రీరామాగమనంబును
పౌరులు మెచ్చంగ వేగ భరతునితోడన్
గారాబమునం బలికితి
వౌరా? తుళ్ళూరు వీరహనుమత్స్వామీ 53

క. శ్రీమదయోధ్యను సీతా
రాముని పట్టాభిషేకరమ్యోత్సవమున్
పేమంబునఁ గాంచితివి, ని
రామయ తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 54

క. శ్రీరాముఁడు నీయందలి
కారుణ్యముచేత నీకుఁ గంఠమునందున్
హారముఁ జేసెను ముక్తా
హారముఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 55

క. భావిబ్రహ్మవు మృతసం
జీవివి సాహితపు నిరంతశేముషివి చిరం
జీవివి యోగివి సద్భ
క్తావన తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 56

క. శ్రోవరు సద్గుణము వైచిన
సివాలముఁ ద్రోయలేక నేరుపుకొలఁదిన్
లావరి భీముఁడు భీతిలె
నావలఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 57

క. భీముఁడు నీచారిత్రము
దీనుసమున నుడువనపుడు దిన్నవినియున్
బ్రేమించితివనివింటి ని
రామయ తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 58

క. సౌగంధికకసులము నను
రాగంబునఁ గైకొనఁజను రాట్భీమునకున్
బాగుగఁజూపవెరూపుది
తాగమ? తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 59

క. ఇంపుగ యుగ వర్తనమున్
బెంపొలయఁగ భీముతోడఁ బేర్కొని సోఁదిన్.
గొంపోవఁగ సౌగంధిక
మంపవె తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 60

క. రణమునఁ బార్థుఁడు నినురథ
గణ కేతనముగ ధరించి కౌరవచయమున్
వణకించుచు నటుమీఁదట
నణఁచఁడె తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 61

క. ఒంటియ వాహానమెప్పుడు
నొంటరివై దిరుగువాఁడ వొండొండొగులున్
గెంటుకలాడెదరొగి నీ
యంటునఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 62

క. వ్యక్తులు నవ్యక్తములో
రక్తములగు మఱియుఁ బుట్టు రేఁబవలులలో
వ్యక్తమువ్యక్తాతీతా
వ్యక్తముఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ. 63

క. జీర్ణాంబరమును విడచియుఁ
దూర్ణాంబునఁగట్టు క్రొత్త ధోవతిఁబోలెన్
బూర్ణాత్మయు నొందును గరు
ణార్ణవ తుల్లూరు వీరహనుమత్స్వామీ 64

క. స్థావరజంగమములకున్
లో వెలుపల నిండియుండి లోకొని జగమున్
దావరమాగద గనఁదా
నావలఁ దుల్లూరు వీరహనుమత్స్వామీ. 65

క. పరమేశ్వరుఁడుండుఁ జరా
చరములఁ బూదండలోని సన్ననినూలున్
బురడించుచుఁ జోద్యంబగు
నరయఁగఁ దుల్లూరు వీరహనుమత్స్వామీ. 66

క. గురుశుశ్రూషకుఁడితరే
తరతరవిద్యార్థియుఁబరతత్త్వేచ్ఛకుఁడున్
నిరతాచారుండగు వటు
వరయఁగఁ దుల్లూరు వీరహనుమత్స్వామీ. 67

క. పరమాత్మానుష్ఠాతయుఁ
బరదేశాభ్యాగతుండు భార్యాయుతుఁడున్
వరగృహమేధి యపత్యం
డఁయుఁగఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ. 68

క. సన్న్యాసియు సన్న్యాసితొ
సన్న్యాసియు విప్రతుండె సన్న్యాసియునన్
ఉన్న్యాసపేక్షకర్తుఁడ
నన్న్యుఁడు దుళ్లూరు వీరహనుమత్స్వామీ. 69

క. జనుఁడను నీ మాహాత్మ్యముఁ
దొడరియుఁ దెలియంగజాలఁడుది మొదలైనన్
నడవడి యెటువర్ణింపఁగ
నడరెదఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ 70

క. తప్పియుఁ ద్రోవంబడితిని
నిప్పగిదిని గాలమెల్ల నెడపక యొకటన్
రప్పిఁ పుము నొప్పింపక
యప్పా? తుళ్ళూరు వీరహనుమత్స్వామీ 71

క. నినుఁబూజించెడు వారల
కనుఁగవ కెదుటను గనఁబడుఁగాదే నీరూ
పనిశము హృన్మోదంబుగ
ననఘా? తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 72

క. అయ్యా! నీదాస్యముచేఁ
జయ్యనఁ దాపత్రయంబుఁ జక్కఁగ నణఁగున్
గుయ్యాడి బాగును దఁయ్యం
బయ్యారే! తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 73

క. నీవేజులు మదభీప్సిత
దైవము వేఱొండు లేఁడు దాసునిఁ బ్రోవన్
గావుము కైవల్యంబిడు
మావలఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ 74

క. ఆపద్బాంధవుఁడవుగా
కాపదలేయిడెడు వేళనైనను నిన్నే
బ్రాపుగఁ గొలిచెదఁ దలఁపక
యాపదఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 75

క. నా కై నేనే వెఱతును
స్త్రీకై పూజలు సమగ్రనియమాభిరతిన్
నాకొలఁదిని జేయక సుగు
ణాకర తుళ్లూరు వీరహనుమత్స్వామీ. 76

క. నీచిత్తమువచ్చినతఱి
నాచిక్కులుఁ దొలఁగిపోవునా యక్కఱలన్
యోచింపకగూరును శై
ర్యాచల తుళ్లూరు వీరహనుమత్స్వామీ. 77

క. క్రూరుఁడ దురహంకారుఁడ
వైరుఁడ నభిమానుఁడంబర భాగ్యవనుఁడన్
గోరెద నీదాస్యము జో
హారిడి తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 78

క. పటుకరణేంద్రియ వర్గము
మటుమాయలఁ బుచ్చుచుండు మనుజులనెపుడున్
గటకట బోవిడఁగఁ జేయకు
మటునిటుఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. .9

క. నిష్పద్ధంబులకును బాగ
గప్పలు దేహికినిమావిగ్రమ్మెడురీతిఁ
గప్పనుగానము జ్ఞానము
నప్పా? దుఖ్ఖారు వీరహనుమత్స్వామీ. 80

క. జ్ఞానంబును విషయంబులఁ
గానంజాలక గడపితిఁ గాలమునిఁకపి
జ్ఞానముకై జేసెద నీ
ధ్యానముఁ దుఖ్ఖారు వీరహనుమత్స్వామీ. 81

క. నీభక్తు ని కెయ్యెడలను
వైభవములుఁ బ్రాభవములుఁ బైఁబై నెన్నో
సౌభాగ్యమ్ములు నగుఁగన
కాభా? తుఖ్ఖారు వీరహనుమత్స్వామీ. 82

క. కరచరణేంద్రియ జిహ్వలు
నిరతము దుర్వృత్తులందు నిలుచుచు విధులన్
బరువడిరోయును శిక్షణ
మరయుఁడు దుఖ్ఖారు వీరహనుమత్స్వామీ. 83

క. ఆధివ్యాధులు నినాం
రాధించినఁ బోఁగడఁగును రాత్రింబవలున్
శోధింతువు భక్తార్తిసి
వ్యాధుఁడఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ. 84

క. అజ్ఞానంబున నేనీ
యాజ్ఞకు వ్యత్యస్తుఁడనని యరసియుఁ బ్రోవన్
బ్రాజ్ఞుండవు గణుతింపక
యజ్ఞతఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ. 85

క. కించి జ్ఞడలగ్గగుల
నంచితముగఁ దెలియఁజాలనహరహమున్నా!
వంచనఁదీర్చవె చూపియు
నంచెలుఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ 86

క. మానసహంసము నిలుచును
నీనామామృతముఁ గ్రోలినియుండ నె యా
శానీహారము తెరిమెడు
నైనం దుళ్లూరు వీరహనుమత్స్వామీ 87

క. ప్రాణాపాయము లెన్నియొ
నానారీతులఁ బొలఁగెను నాకాయత్నం
బే నాఁటికి లేకయె నీ
ధ్యానం దుళ్ళూరు వీరహనుమత్స్వామీ 88

క. సమ్మతి నీపదకంజము
నెమ్మనమున భక్తితోడ నిరతమనంతా?
ఇమ్ముగఁ గాపాడుము ధై
ర్యమ్మునఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ. 89

క. పంతం బేలా? నాపయిఁ
గొంతైనను దయను జూపఁగోరిక లేదా?
వంతలువింతగఁజూడక
నంతా? తుళ్ళూరు వీరహనుమాత్స్వామీ. 90

క. గురువులయెడఁ బుత్రులయెడ
నొరునెడఁ జెలియెడఁ బ్రభులసహోదరులయెడన్
జరియించెడు నడవడినిడు
మరయక తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 91

క. నీయండను బాయంగను
జేయంగలదయ్య మాయ చెంగటకును రా
నీయక గాపాడుము నా
యాయువుఁ దుల్యాఖ్య వీరహనుమత్స్వామీ. 92

క. రేయింబవలును నఘములుఁ
జేయంబడుచుండెఁ బైనఁ జెడ్డగు, నఘముల్
ద్రోయము సతమే కాయం
బాయువు తుల్యాఖ్య వీరహనుమత్స్వామీ. 93

క. పోయెం బో బాల్యము వా
లాయముగాఁ బోవనుండి లగ్గలుఁ జూపెన్
ప్రాయము, వృద్ధాప్యము కా
పాయెను దుల్యాఖ్య వీరహనుమత్స్వామీ. 94

క. దిక్కెవ్వరో యెఱుఁగను బైఁ
ప్రక్కలఁబడుచున్న వారు ప్రాణముబోవన్
నిక్కయుఁ జూడరు నీ ది
క్కక్కఱతుల్యాఖ్య వీరహనుమత్స్వామీ. 95

క. దారాపత్యసుహృద్గా
వారికులెల్లఱు స్మశానవాటిక వఱకుఁ
జేరెదరీవేపై ది
క్కారయఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ. 96

క. ఎన్నోమాఱులు వేడితి
బన్నంబేమనఁగఁ బోవు బధిరంబా? ని
న్నన్నానని కోపంబా?
యన్నా? తుళ్లూరు వీరహనుమత్స్వామీ. 97

క. నీనామస్మరణము నే
నేనాఁడైనను సలుపఁగ నేరమికిని నేఁ
డేఁనాటికిఁ జేతునునీ
ధ్యానముఁ దుళ్లూరు వీరహనుమత్స్వామీ. 98

క. నిన్నే సకలంబుగఁ గని
యన్నిఁటఁ బూజించువాఁడు హాళహాళిగనునీ
సాన్నిధ్యంబున కర్హుం
డన్నా? తుళ్లూరు వీరహనుమత్స్వామీ. 99

క. రామునకును లక్ష్మణునకు
భీమునకుం గపివరునకుఁ బ్రియభక్తునకున్
బ్రాముఖ్యం శంద్రునిను, ని
రామయ తుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 100

క. వగవఁడు దుఃఖంబులఁదడ
వఁగఁబో డెప్పుడు హృషీకవర్గంబునకున్
బగఁబూనఁడు నీభక్తుం
డగటునఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 101

క. పీతాంబరధారివి, లో
కాతంక విదారివి, విజయాలంక్రియ స
త్కేతనహారివి, రామప
దాతివి, తుళ్ళూరు వీరహనుమత్స్వామీ 102

క. "నరసింహాచార్య"నకుం
బరమవ్రత "మంగమ"కును పరసుతుఁడను సో
దరుఁడను "శేషా"ర్యునకును
నరుహుఁడఁ దుళ్ళూరు వీరహనుమత్స్వామీ. 103

క. "వేంకటనరసింహు"ఁడుఁ ద్వ
త్కైంకర్యరతుండ "దిట్టకవ్య"న్వయుఁడన్
అంకితమిచ్చితి ధృతసూ
న్యాంకా? తుఘ్లాకు వీరహనుమత్స్వామీ. 104

క. ఆతారార్కము శతకముఁ
గౌతుకమునఁ బ్రోవుమయ్య కవిజన మెపుడున్
భూతలమున నుతియింపఁగ
ఖ్యాతిగ తుఘ్ఘ్యాకు వీరహనుమత్స్వామీ. 105

క. బెజవాడమరావతులకు
నిజముగ మధ్యస్థమంద్రు నీపురమరయన్
విజయము కృష్ణాతీరం
బజవర! తుఘ్ఘ్యాకు వీరహనుమత్స్వామీ. 106

క. వెయ్యాతొమ్మిదివందల
పయ్యిరువది నాల్గగష్టు పదియవతేదిన్
నియ్యంబడె నీకంకిత
మయ్యా! తుఘ్లాకు వీరహనుమత్స్వామీ. 107

క. పన్నిద్దఱు సూరులకుం
బన్నుగఁ బ్రణమిల్లిశతక పంకేరుహామున్
గ్రన్నన నేనర్పించెద
నన్నా! తుళ్లూరు వీరహనుమత్స్వామీ. 108

క. శ్రీ "మాదిరాజు" వంశల
లాముని "రఘునాధరాయ" లాలితయశునిన్.
ధీమంతునిఁ గాపాడు ని
రామయ తుళ్లూరు వీరహనుమత్స్వామీ. 109

క. గ్రక్కున శతకము వ్రాయఁగ
జక్కఁగ శ్రీ "యబ్బరాజు జగ్గాంబ" లకున్
మక్కువ కొమరుఁడుఁ బేరకుఁ
డక్కటి తుళ్లూరు వీరహనుమత్స్వామీ. 110

క. మంగళము పవనజునకును
మంగళము దశరధరామ మంత్రీశునకున్
మంగళము వేదితాత్మకు
మంగళము మదీప్సితునకు మంగళమెపుడున్. 111

# ప్ర క ట న.

---

**చంద్రహాస చరిత్రము:**—పద్యకావ్యము, శ్రీమాన్ శతావధాని శ్రీ మాడపాటి తిరుమల శేషాచార్యకవి ప్రణీతము, శృంగారరస ప్రధానము, కరుణారసపూరితము, నీతిదాయకము, త్వరలో వచ్చును.

ప్రతి 1కి వెల రు 0—6—0

**గ్రామమునసబు పరీక్ష పేపర్లనోట్సు:**— పన్నెండు సంవత్సరముల పేపర్లకు ఉత్తరములు వ్రాయబడినవి. ఇది రెండుమాఱులు శ్రద్ధగా జదివినయెడల నెలలకొలది పుస్తకములు కంఠపాఠము చేయుటందప్పిపోవుటయేగాక సులభముగా పరీక్షయందుగృతార్థులయ్యెదరు, నూతనకల్పింపబడిన దరఖాస్తులు వచ్చినవెంటనే అచ్చువేయింపబడును. పుస్తకము 1కి వెల రు 0—8—0

**అకారాది రోగచికిత్సానిధి:**—గూఢముగనుండి బయల్పడని పెక్కుచికిత్సలం జేర్చివ్రాయబడినవి. త్వరలో ముద్రింపింపబడును.

వెల రు 1—8—0

☞ ఇవి కోరువారు క్రిందియడ్రెసుకు వ్రాసినం బడయగలరు.

మాదిరాజు రఘునాథరావు

అబ్బరాజుపాలెం,

(ప్రస్తుతం) గుంటూరు.